# తిరుప్పావై

దివ్యప్రబంధం

# మేలుపలుకుల మేలుకొలుపులు

ముళ్ళపూడి వెంకటరమణ

బొమ్మలు: బాపు



# సిరినోము

కొండంత దేవుడికి గోరంత పత్రిచాలు – అది భక్తితో ఇస్తేనే.

వేదవేదాంతాలూ అర్థపరమార్థాలూ మంత్ర తంత్రాలూ తెలిసిన ఎంత జ్ఞాని అయినా భక్తి లేకుండా కొండంత పత్రీ పూలూ గుమ్మరించినా అవి గోరంత కూడా స్వామికి చేరవు–చాలవు. ఈశ్వర స్పృహలేని జ్ఞానం మేఘాలమధ్య ఇరుక్కున్న సూర్యచంద్రుల వంటిది. కొరగాని వెలుగు. అట్టి జ్ఞానానికి అహంకారమనే చత్వారం వస్తుంది.

భక్తి–నిర్మలమైన స్వచ్ఛమైన భక్తి – కుచేలుడి అటుకుల వంటిది. శబరి ఎంగిలిచేసిన పళ్ళవంటిది. మూడు కన్నుల దేవరకు తన కన్ను అమర్చడానికి ఆయన ముఖంమీద తన కాలిజోడును ఆనవాలుగా తొక్కిపెట్టిన కన్నప్ప ప్రేమలాటిది. శ్రీకృష్ణుడి తలనొప్పి తగ్గించడానికి భక్తుల పాదధూళి కావాలన్నారు వైద్యులు. కన్నవారూ కట్టుకున్నవారూ అన్నగారూ కూడా పాదధూళి ఇవ్వడానికి భయపడ్డారు. తాము ఏ నరకానికి పోయినా చింతలేదుగాని కన్నయ్య సల్లగుంటేసాలు అంటూ తమ పాదాలకంటిన దుమ్ముతీసి స్వామి నుదుట విబూదిలా పూశారు గొల్లభామలు – అదీ స్వచ్ఛమైన ప్రేమ; భక్తి.

అలాగే తాను స్వామిని వరించి, ఆ ప్రేమకొద్దీ – తాను ధరించి తీసిన హారాన్ని, తనకు తానే నైవేద్యం పెట్టుకున్న హారాన్ని, స్వామికే ప్రసాదంగా పంపింది గోదాదేవి (ఆండాళ్‌తల్లిగా అవతరించిన శ్రీమహాలక్ష్మి). ఆమెను కడుపారా కనకపోయినా తులసివనంలో కనుగొని పెంచిన తండ్రి విష్ణుచిత్తుడు. నిత్యం ఆయనా, ఆలయ పరివారమూ సమకూర్చి పంపిన హారంలోని విరులకన్న, ఆ మాలలో చేరిన ఆండాళ్ కురుల పరీమళమే స్వామికి నచ్చింది. అనురాగమను రాగంలో భక్తిప్రేమలు మేళవించిన లోకోత్తర సౌరభం అది. అంతవరకూ అర్చకాది దేవసేవకులు దైనందిన విధ్యుక్త ధర్మంగా – భక్తి గురించిన స్పృహ లేకుండా కట్టితెచ్చిన హారాలను స్వామి భరించాడు; కాని ఆండాళ్ తన సిగలో ముడిచి, నీటిలో ప్రతిబింబంచూసి మురిసి – తీసిన మాలను పంపితే స్వామి ప్రేమతో ఆనందంగా ధరించసాగాడు.

"అమ్మా – స్వామికి మనమిచ్చు నైవేద్యాన్ని ఆయన ప్రాశించి ఆమోదించాక దానినే మనం ప్రసాదంగా స్వీకరించాలిగాని – మనం రుచిచూసిన ప్రసాదాన్ని ఆయనకు నైవేద్యం పెట్టకూడదు, ఇది తప్పు" అని చెప్పబోయాడు తండ్రి – పెరియాళ్వార్ అనే విష్ణుచిత్తుడు. కాని ఆ కురుల విరుల పరీమళాల పరిష్వంగ సౌరభాలను క్రమంగా అవధరించి ఎరుకపరచుకున్నాడు ఆయన. అప్పుడు తానే గోదాదేవిని రంగనాథునికి అర్పించి తానూ తరించాడు.

సహజ పరీమళాలు గుబాళించే విరులదండలకు కన్నెపిల్ల నెరికురుల సౌరభాన్ని జోడించి పరమాత్ముడినే ముగ్ధుడిని చేసిన ఈ గోదాదేవి పన్నెండు వందల ఏళ్ళ కిందట అవతరించిన వైష్ణవ వైతాళికులు పన్నిద్దరాళ్వారులలో ఏకైక మహిళ. ఆళ్వారులు పాడిన నాలాయిర ప్రబంధంలో (నాలుగు వేల పాశురాలు) గోదాదేవి పాడిన ముప్పది పాశురాలకు అతి విశిష్టమైన స్థానం ఉంది; అది కన్నయ్యను వలచిన కన్నెమనసుల సరాగాల మాల. మేలు పలుకుల మేలుకొలుపులు.

కలియుగంలోని శ్రీ విల్లిపుత్తూరు గోదాదేవి – ద్వాపరంలోని రేపల్లె గొల్లభామగా తనని తాను భావించుకుంది. తమ మధ్యనే తిరుగాడే శ్రీకృష్ణస్వామిని పగలంతా చూస్తున్న సంతోషం, రాత్రివేళ చూడలేని తాపం, తెల్లవారే వేళనే కన్నులారా చూసి తరించాలన్న తపన, ఆత్రం కలబోసిన భావరాగానురాగాల పారిజాతాల మాల ఈ తిరుప్పావై.

ఈ మేలుకొలుపులు ఎవరికి? నీలా తుంగస్తనగిరి సానువులలో తలవుంచి నిదురించే – నిదుర నటించే కృష్ణస్వామికా? కాదు – గోకులంలోని తనయీడు కన్నెపిల్లలందరికీని. ఇంటింటికీ వెళ్ళి వాళ్ళని నిదురలేపడం – "అక్కా లేవే – చెల్లీ లేవే – ఈ ధనుర్మాసంలో ముప్పది నాళ్ళు మనం కాత్యాయనీవ్రతం తలపెట్టాంగదా – మరచిపోయారా – లేవే – ఈ తిరుప్పావై (సిరినోము) శ్రద్ధగా చేస్తే అమ్మవారు వరమిస్తుంది. అప్పుడే కన్నయ్య మనందరినీ పెళ్ళాడతాడు.

లెండి త్వరగా రండి – యమునకు వెళ్ళి పొద్దుపొడిచేలోగా వెన్నెల్లో చలిలో స్నానాలు చెయ్యాలి మనం. ఎంత చలి అయినా తప్పదు – లెండి – 'ఇష్టఫలమును అందుకొనుటకు కష్టపడవలె చెల్లెలా" అంటూ ఇంటింటికీ వెళ్ళి తలుపులు తట్టుతుంది. బద్ధకిష్టులను ముద్దుగుమ్మలను మొద్దుగుమ్మలుగా వెక్కిరిస్తుంది – రెచ్చగొడుతుంది.

కృష్ణలీలలు పాడుకొంటూ అందరూ కలిసి నందరాజు భవంతికి వెళ్తారు. అక్కడ ముందుగా కావలివారిని మర్యాదగా పిలిచి తలుపులు గడియలు తీయమంటారు. ఆ తరువాత బలరామస్వామి, ఆ పిమ్మట నందరాజు, యశోదమ్మలు. సాధింపులలో నందరాజును కూడా విడిచిపెట్టదు గోదాదేవి.

"ఏమయ్యా స్వామీ– గోకులంలో ఆబాలగోపాలాన్నీ, ఆవుదూడలనూ, వాళ్ళ ఆకలీ దప్పికా కుశలం కనిపెట్టి కాపాడతావే– ఈ కన్నెపిల్లలు నీ గుమ్మంలో చలిలో నిలబడి వణికిపోతున్నారే– ఆమాత్రం పసిగట్టలేవా" అని సాధిస్తుంది.

నందరాజునేకాదు– వైకుంఠపాలకుడు సాక్షాత్ విష్ణుమూర్తినే సతాయిస్తుంది. "ఓ స్వామీ– ముప్పది ముక్కోటి దేవతలకు ఎప్పుడు ఏముప్పొస్తుందోనని ఎల్లవేళలా కావలికాచే మురారిగారూ– కాస్త మా మొర వినరా– నిన్ను పొందగా నోముపట్టినా కన్నెపిల్లలం మేమూ– చలిలో గజగజ వణుకుతు నిలచిన చిన్న పిల్లలం మేము" అని.

చివరగా కన్నయ్య సతీమణి నీలాసుందరీదేవిని మేలుకొలుపుతుంది– స్వామిని కౌగిటిలో బంధించి విడవకుండా నిద్రనటిస్తున్న అమ్మవారికి వేడికోలు.

తాము సిరినోము పట్టామనీ, స్వామివారు ఆ నోముకు కావలసిన 'పూలూ పాలూ పళ్ళూ కొబ్బరిబూరాలూ తప్పెట్లూ, తాళాలూ' ఇస్తామని చెప్పారనీ, అవి తీసుకుని యమునకు వెళ్ళి స్నానమాడి అమ్మవారికి పూజలు చేసి నైవేద్యాలు పెట్టాలనీ చెప్తారు. అంతవరకూ పాలూ పూలూ చక్కెర పొంగలి, దద్ధ్యోదనం ఇవేమీ ముట్టకూడదు– ఆకలేసినా నోరూరినా మనసూరినా పూజ ముగిసేవరకూ చూడరాదు, వాసన చూడరాదు. అప్పుడు కృష్ణస్వామిని అందరం పెళ్ళాడవచ్చు– అంతే వాళ్ళకి కావలసింది.

ఇంతమంది ఒక్క స్వామిని ఒక్కసారిగా పెళ్ళాడటమా– అది జరిగేపనా అని ఈ కన్నెపిల్లలకు ఆ ఆలోచన కూడా ఉండదు– అంత అమాయకత్వం– అంత స్వచ్ఛమైన ప్రేమ– వెన్నకాచిన నేయిలాగా.

అంతలో అన్నిటినీ తిరగేస్తే మనసులోని నిజమైన కోరిక గుర్తుకు వస్తుంది. "స్వామీ స్వామీ– అన్నట్టు ఉన్న సంగతి మరిచేపోయాం– మేమింతవరకూ అడిగినవన్నీ చిన్నాచితకా పెద్దాగొప్పా కోరికలూ వరాలూ అన్నీ – తూనాబొద్దు– అన్నీ చెరిపేసెయ్– మాకు మేడలూ మిద్దెలూ వద్దు– పెళ్ళీ సంసారాలూ వద్దు– నగానట్రా వద్దు, స్వర్గం మోక్షం వద్దు– మాక్కావలసింది నువ్వు– నువ్వే.

నువ్వు కనపడాలి– అంతలో మాయమైపోవాలి– మేము వెతకాలి– నిన్ను తిట్టుకుంటూ సాధించాలి– మళ్ళీ నువ్వు కనిపించాలి– మేము సంబరపడి గంతులు వెయ్యాలి... ఇంతకు మించి మేము తెలిసో తెలియకో వేరే వరాలేవైనా కోరి ఉంటే– అవన్నీ తుడిచిపారెయ్. స్వామీ–నువ్వే–నిన్ను చూడని బెంగా, నిన్ను చూసిన సంబరం – ఇంతే – ఇవి యమునలో కెరటాల్లాగా వస్తూ వెళ్తూ మళ్ళీ మళ్ళీ వస్తూ ఉండాలి. మా నోములూ పూజలూ ఇందుకే–"

ఇటువంటి వరాన్ని ఏ మహర్షులూ యోగులూ భక్తులూ అవధూతలూ కూడా కోరలేదు. చిరంజీవత్వం, స్వర్గం భోగాలూ అవి దాటితే మోక్షమూ తప్ప – ఇలా భగవంతుడితో కేరింతలూ ఆటపాటలూ దాగుడు మూతలూ ఆడటం–ఆనందించడం కన్నెమనసులకే తెలుసు.

"తీరబోయే కోరిక – ఆరబోయే హారతే –
తీరీ తీరని కోరికలే మేము కోరే వరాలు."

* * *

యాభై అరవై సంవత్సరాల క్రితం తిరుప్పావై మాకు తటస్థపడింది. జై భారత్ అనే పత్రికకోసం దీనిని శ్రీ బొమ్మకంటి సింగరాచార్యులవారు తెనిగించారు. ఎడిటర్–న్యాపతి నారాయణ మూర్తిగారు (రేడియో అన్నయ్యకి అన్నయ్యగారు) దానికి బాపుచేత బొమ్మలు వేయించారు. అప్పుడు తెలుగులో అర్థం చెప్పించుకున్నాడు బాపు – నేనూ విన్నాను. అది ముప్ఫయి పాశురాల చిన్నపుస్తకం. తమిళుల వేదమైన నాలాయిర ప్రబంధంలో విశిష్టమైనది అని చెప్పారు. నాలుగు వేదాల, నూట ఎనిమిది ఉపనిషత్తుల, షట్ దర్శనాల సారం అంతా ఇందులో దాగి ఉందనీ, గోదాదేవి అనుగ్రహించిన ఈ ముప్ఫయి పాశురాలూ భావార్థ నిగూఢార్థ తాత్పర్యాలతో అమరి ఉన్నాయనీ అక్కడి పండితులూ జ్ఞానులూ చెప్పారు. అర్థంకాకపోయినా సరే వీటిని చదివితేచాలు పరమార్థం సిద్ధిస్తుందన్నారు. ప్రతి సంవత్సరం ధనుర్మాసంలో వైష్ణవ దేవాలయాల్లో – తిరుమలలో కూడా – తెల్లవారుఝామున చాలా గంభీరంగా వేదమంత్రాలవలె – ఏ భావోద్వేగమూ లేకుండా అర్చకస్వాములంతా కంఠోపాఠంగా చదువుకుపోయేవారు – అదీ ఒక కైంకర్యమన్నట్లు.

దరిమిలా మేము ప్రొ॥ గోపాలన్, పి.బి.శ్రీనివాస్ వంటి వైష్ణవ మిత్రుల ద్వారా అర్థాలు చెప్పించుకున్నాం. అప్పటికి మాకు తమిళమే రాదు – సెందమిళ్ (శిష్టతమిళం) అంతకన్నా తెలియదు. మేము ఎరుకపరచుకున్న దానికీ ఈ పాశురాలను పఠించే తీరుకీ ఎక్కడా పొంతన కనబడలేదు.

ఇందులో పాటలు – కన్నెపిల్లలు నోము పట్టడం, తెల్లవారు ఝామున లేచి ఇంటింటికీ వెళ్ళి తలుపులు తట్టి తోటి నేస్తాలను లేపడం, వాళ్ళు చలికి భయపడి దొంగనిద్రలు నటించడం, గోదాదేవి వాళ్ళను ఆటపట్టించి బయటకు రప్పించడం, అప్పుడు అందరూ యమునకు వెళ్ళి చలిలో జలకాలాడటం, అన్నీ ఎకసెక్కాలతో కేకలతో అల్లరీ చప్పట్లతో చాలా సరదాగా అట్లతద్ది ఆటల్లా కన్నెపిల్లల అల్లరి పాటల్లాగే ఉన్నాయి. వీటిలో గోదాదేవి నందరాజు లోగిలికి కావలి వారినీ, గోకులాన్ని ఏలే నందరాజునూ, చివరికి లోకాలనేలే విష్ణుమూర్తినీ కూడా ఎగతాళి చేసి వీధిలోకి రప్పించడం ఎంతో సరదాగా ముచ్చటగా ఉంటుంది. ఇదీ నిర్మలమైన భక్తి. కోరికలనే కోరని భక్తి. సిరిసంపదలుగాని స్వర్గంగాని చివరకు మోక్షం కూడా వద్దని కేవలం గోపాలదేవుని సఖ్యంకోరే భక్తి. ఇలాటి వాటిలో వేదవేదాంతార్థాలు నిక్షిప్తమై ఉన్నాయని కొంతమంది పండితులు వ్యాఖ్యానాలు చేశారు. హాయిగా పాడుకునే పాటలను భట్టీయం వేయించారు. అశ్వమేధ యాగాది హోమాల పూజల వ్రతాల మంత్రాల్లాగా స్వరశుద్ధంగా చదవడం నేర్పడం చేశారు. మంత్రాలు వింటున్నప్పుడు – మాంగల్యం తంతునా అన్న మంత్రాలను పలుకుతున్నప్పుడు వాటిలోని అర్థాలకేసి దృష్టిపోదుకదా – అలాగే ఇవీని.

పండితులే కాదు– ముఖ్యంగా పామరులు భక్తితో ఆనందంతో హాయిగా పాడుకునే ఈ పాటలపైన ఈ విధంగా పాండిత్యమూ జ్ఞానమూ ఆవరించేశాయి.

ఈ స్థితిలో ప్రసిద్ధగాయని ఎం.ఎల్.వసంతకుమారి ఈ పాశురాలను గ్రామఫోను రికార్డులుగా ఇచ్చారు (78 ఆర్.పి.యం). అప్పట్లో ఈపీ, ఎల్‌పీ (ఎక్స్‌టెండెడ్ ప్లే, లాంగ్ ప్లే) రికార్డులు కూడా రాలేదు. టేపులు అంతకన్నా లేవు. మైలాపూరులో బాపు ఇంటికి దగ్గరలో ఉన్న ఆంజనేయ స్వామి కోవెల దగ్గరకు తెల్లవారు జామున నాలుగింటికి వెళ్ళి నిలబడితే ఈ పాశురాలు నాలుగైదు (న్యాయంగా రోజుకు ఒకటే) పెట్టేవారు. హాయిగా మెత్తగా స్తోత్రగానం లాగా ఉండేది ఆవిడపాట. నేను అనుకున్న అల్లరి తనం లేకున్నా– ఏదో గొప్పపాట వింటున్నామన్న ఆనందంతో భక్తితో అవి విని వెళ్ళిపోయేవాడిని. పాటలో సంగతికీ పాటల సంగతికీ కొంతయినా పొంతన కుదిరేది.

తరువాత తెలుగులో మరికొందరి అనువాదాలూ అనుకరణలూ అనుసృజనలూ చదివాక – ఈ తిరుప్పావై వేదాంతసారం అన్న భావానికే ఎక్కువ ప్రాధాన్యమిచ్చారని పించింది. భక్తి అనే చంద్రుడిని వెన్నెలను ఈ పాండిత్యం

ఈ జ్ఞానం అనే మేఘాలు కమ్మేశాయి. తమిళుల పట్టుదలలు ఎక్కువ కారణం కావచ్చు. అలాగే తెలుగులోనూ కొంతకాలం తేటతెలుగు పాటలు రాలేదు.

మరికొంతకాలానికి మహాకవి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు – ఆయన ఒక్కరే వ్రాయగలిగిన మల్లెమొల్ల పారిజాతాల భాషలో – వ్రాశారు. పూజ్యులు ముత్తీవి లక్ష్మణ యతీంద్రులు కూడా అనువదించి బాపుచేత చిత్రాలు వేయించారు. ఆ బొమ్మలతో ఆంధ్రప్రభ వారపత్రికవారు దరిమిలా హిందూ ఆంగ్ల పత్రికవారూ కూడా అచ్చువేశారు. అది కూడా ఉదాత్తంగా ప్రౌఢంగా ఉంది. అది పలుసార్లు చదివాక నాకు భాష బాగా చదువుకోని వాళ్ళు పల్లెపిల్లల దగ్గర్నించి అందరూ హాయిగా పాడుకొనేలా ఉంటే బాగుండుననిపించింది. ఇది పండితుల, పెద్దల మాటకు ఎదురేగడంకాదు; విశ్వనాథవారు రామాయణం చెబుతూ అన్నట్లుగా నాదైన రచన నాదిగాన అనుకుని ప్రయత్నించాను.

తేలిక మాటలతో రాయడం అన్నిటికన్న కష్టం. కొన్నిఏళ్ళుగా అడపాతడపా సరదాగా ప్రయత్నాలు చేసినా కుదరలేదు. కాని కన్నెపిల్లల స్వచ్ఛమైన అమాయకత్వాన్నీ ఆటలపాటల హాయినీ తమసానది రేవులా, మంచివాడి మనసులా, తేటగా చూపించాలనీ తేనెలా పలికించాలనీ ఆశకలిగింది.

ఏ వేదంబు పఠించె లూత... అన్నట్లుగా శ్రీకాళహస్తిలో పరమేశ్వరుని కృపని పొందిన సాలెపురుగు, పాము, ఏనుగు, కన్నప్ప– ఎట్టి విద్యాగంధమూలేని జీవులు, కేవలం స్వచ్ఛమైన భక్తివారిది. ఆ భక్తే ముజ్జగాలనూ బొజ్జలో ఉంచుకున్న స్వామిని తులసీదళంతో తులతూచింది– అంతేగాని శ్యమంతకమణి కురిసిన సంపదలతోకాదు. శబరి ఎంగిలిపళ్ళు, కుచేలుడి అటుకులూ, విదురుడి అరటిపండు తొక్కలూ అలాటివే. తిరుప్పావైలో ఆండాళ్ తల్లి పాటలు, గోదాదేవి తన సిగలో ముడిచి విడిచి స్వామికిచ్చిన హారమూ అలాటివే –

నా యీ ప్రయత్నమూ అలాటిదే– నా సరదా; ఈ అల్లరి పిల్ల పాడిన పాటలకు చుట్టబెట్టిన పట్టుచీరలూ పండిత శాలువాలూ తొలగించి – వాటి చాటున వున్న పైట పరికిణీలూ పాదాలమీద పాంజేబులూ వాటిమీద నాట్యమాటే పరికిణీ కుచ్చెళ్ళ వెల్లడి చేయాలి... అవి సాధారణ నూలు వస్త్రాలు కావు; పట్టువీ కావు. పచ్చి వెన్నెలా పైరగాలీ మంచుపొరలూ కలబోసి నేసిన స్వచ్ఛమైన అచ్చమైన కన్నెపిల్లల దుస్తులు. చల్లాకవ్వం వెన్నా తప్ప అన్యమెరుగని ఈ అపండిత గొల్లభామలు దేశమేలే రాజునేకాదు; లోకమేలే దేవుడిని కూడా మేలమాడగల వెక్కిరించగల అల్లరి పిల్లలు – వారి ఆటపాటలలో, మాటలలో గూఢార్థాలుండవు. సరదాలూ సరసాలూ ప్రేమ... వాటిని అలాగే పాడుకోవాలనీ, కాపాడుకోవాలనీ పండితులేకాక పామరులు కూడా ఆ హాయిని రుచిచూడాలనీ నా ఆశ... ఇది పెద్దలపట్ల ధిక్కారంకాదు. అహంకారం కాదు. ఒక సూర్యుడు సమస్త జీవులకు తానొక్కడైతోచు... అన్నట్లు నాకు కనిపించిన రామచక్కని కావ్యం... అంతే. ఇటీవల అప్పుడప్పుడు తళుక్కున మనసులో మెరిసే ఒక పాశురంలోని మాటల వరసను పైకి అన్నప్పుడు– ఎమెస్కో విజయ కుమార్‌గారు అవి బాగున్నాయన్నారు. సులువుగా నోటతిరిగి మనసుకి ఉల్లాసం కూర్చేలా ఈ పాశురాలు బాపు బొమ్మలతో వేద్దామన్నారు.

ఇదీ జరిగింది– ఇది నేను వ్రాసిందికాదు– శ్రీ ఆండాళ్‌తల్లి అనుగ్రహించింది.

ధన్యోస్మి–

ఎమెస్కో అధిపతి శ్రీ విజయకుమార్ గార్కి నా ధన్యవాదాలు.

– రమణ

## 1

నల్లాని సామినీ పెళ్ళాడ మనసైతె
తెల్లారుజామునే చలిమునక వెయ్యాలి
కన్నెమనసూ విప్పి కాత్యాయనికి చెప్పి
మార్గశిరనోమునూ మనసార తలపెట్టి
నందగోపుని పట్టి బృందావనపు జెట్టి
బాలసింగము నడిగి పూలు పాలూ పళ్ళు
కొబ్బరీ బూరాలు తప్పెట్లు తాళాలు
తెచ్చుకోవాలమ్మ తెల్లారిపోకుండ
కన్నెపిల్లా మేలుకో కన్నయ్యనూ లేపగా
**సిరినోము – హరిపూజ – గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

మార్గళి త్తింగళ్ మది నిఱైంద నన్నాళాల్
నీరాడ ప్పోదువీర్! పోదుమినో నేరిళైయీర్!
శీర్‌మల్గుమ్ ఆయ్‌ప్పాడి చ్చెల్వ చ్చిరు మీర్‌గాళ్
కూర్వేల్ కొడున్ తొళిలన్ నందగోపన్ కుమరన్
ఏరార్‌ంద కణ్ణి యశోదై ఇళమ్ సింగమ్
కార్మేని చ్చెంగణ్ కదిర్ మదియమ్‌పోల్ ముగత్తాన్
నారాయణనే నమక్కే పఱైదరువాన్
పారోర్ పుగళ ప్పడిందు ఏల్ ఓర్ ఎంబావాయ్




తిరుప్పావై
దివ్యప్రబంధం
మేలుపలుకుల
మేలుకొలుపులు

## 2

ఇష్టఫలమును అందుకొనుటకు
కష్టపడవలె చెల్లెలా
నోము నోచే ధనుర్మాసం నీమనిష్టలె పూజలౌ
స్నానమంటే యమునలో
చలిమునకలేస్తే చాలదే
మనసు లోపలి మలినమంతా
కడిగి ముగ్గెయ్యాలిలే
పూసిన పూలూ పితికిన పాలూ పూతనాంతకుడి పూజకే
కంటికి కాటుక పెట్టకే
సిగలో పూలూ ముడవకే
వెన్నా మీగడ - జున్నూనేయీ
అన్నీ మన కన్నయ్యకే
కూడని మాటలు ఆడకే
పెద్దల మాటలు దాటకే
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

వైయత్తు వాళ్వీర్‌గాళ్! నాముమ్ నమ్ పావైక్కు
చ్చెయ్యుమ్ కిరిశైగళ్ కేళీరో, పార్కడలుళ్
పైయత్తుయిన్ర పరమనడిపాడి
నెయ్యుణ్ణోమ్ పాలుణ్ణోమ్, నాట్కాలే నీరాడి
మైయిట్టు ఎళుదోమ్ మలరిట్టు నామ్ ముడియోమ్
శెయ్యాదన శెయ్యోమ్ తీక్కురళై శ్శెన్రు ఓదోమ్
ఐయముమ్ పిచ్చైయుమ్ ఆందనైయుమ్ కైకాట్టి
ఉయ్యుమారు ఎణ్ణి ఉగందు ఏల్ ఓర్ ఎంబావాయ్








3

పొట్టివాడైనా చాలా గట్టివాడమ్మా
చెయిజోచి అర్థించి కాలితోమర్దించి
బలిని పాతాళానికంపెనమ్మా
భువనమే మాధవునిదైనా - భూమి మాత్రం తనది అనుకొని
స్వామికే భూదానమిచ్చిన - బలిని పాతాళమునకణచిన
స్వామి వీడమ్మా - అంతర్యామి వీడమ్మా!
మూడు అడుగులమేర అడిగీ - ముజ్జగాలను ఆక్రమించీ
సంహరించక సంస్కరించీ - పాతాళమును పాలించమంటూ
తానె రక్షగ నిలిచినట్టీ - పొట్టివాడమ్మా చాలా గట్టివాడమ్మా!
అట్టివాడిని తట్టిలేపీ - గట్టిగా తలపెట్టినట్టీ
నోముకోసం సంభారాలను కోరుదామమ్మా!
నెలకు మూడు వానల్లు నందనందనా!
గోలచ్చిమి పాలవరద గోవర్ధనా
పూలు విరగబూయాలి చేలన్నీ పండాలి
చేలలోని నీటిలోన మీలు తుళ్ళి ఎగరాలి
బాలపాపలందరూ పూలమల్లెనవ్వాలి
కన్నెపిల్లలందరూ కాత్యాయని నోముపట్టి-
గోపబాలుని చేయిపట్టీ ఆ గడపమెట్టాలీ
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

ఓంగి ఉలగళంద ఉత్తమన్ పేర్ పాడి
నాంగళ్ నంబావైక్కుచ్చాత్తి నీరాడినాల్
తీంగిన్రి నాడెల్లామ్ తింగళ్ ముమ్మారి పెయ్దు
ఓంగు పెరుం శెన్నల్ ఊడు కయల్ ఉగళ
పూంగువళై ప్పోదిల్ పొరివండు కణ్పడుప్ప
తేంగాదే పుక్కిరుందు శీర్తములై పత్తి
వాంగక్కుడమ్ నిరైక్కుమ్ వళ్ళల్ పెరుమ్ పశుక్క
నీంగాద శెల్వమ్ నిరైందు ఏల్ ఓర్ ఎంబావాయ్.









సిరి చిరునవ్వులతో నారి కట్టాలి
హరి! విల్లు శార్ఙాన్ని ఎక్కుపెట్టాలి
వరపాంచజన్యంబు ఉరుములురవాలి
గురు సుదర్శనంబు మెరుపుల్లు మెరవాలి
శరపరంపరలాటి వానచినుకుల్లు
కురవాలి కురవాలి మూడు వరసల్లు
వరిచేలు పండాలి గాదెల్లు పొర్లాలి
చిన్నపిల్లల నవ్వులూ కన్నెపిల్లల కోర్కెలూ
అన్ని పువ్వుల రంగులూ ఆకుపచ్చ హొరంగులూ
కర్పూరనీరాజనాలుగా - అందుకో
నల్లనయ్యా - మా పల్లె నీలిమేఘమా
దివినుంచి భువిముంచ వర్షించు వర్షించు
మా నోము పండాలి మన పెళ్లి జరగాలి
అనుచు కన్నయ్యనూ వరములడగాలి
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

ఆళి మళైక్కణ్ణా! ఒన్రు నీ కైకరవేల్
ఆళియుళ్ పుక్కుముగన్దు కొడార్ త్తేరి
ఊళి ముదల్వన్ ఉరువమ్ పోల్ మెయ్‌కరుత్తు
పాళియన్ తోళుడైప్పర్పనాబన్ కైయిల్
ఆళిపోల్ మిన్ని, వలంబురి పోల్ నిన్రు అదిర్‌న్దు
తాళాదే శార్‌ఙ్గ ముదైత్త శరమళైపోల్
వాళ ఉలగినిల్ పెయ్‌దిడాయ్ నాంగళుమ్
మార్గళి నీరాడ మగిళ్‌న్దు ఏల్ ఓర్ ఎంబావాయ్









## 5

కన్నవారికి బాలుడమ్మా కంసమామకు కాలుడమ్మా!
మాయదారీ అల్లరమ్మా మాయదారీ పిల్లడమ్మా
పట్టబోతే దొరకడమ్మా ఇట్టె చూస్తే మాయమమ్మా
మనకెకాదూ తనకె దొరకని దొంగవీడమ్మా గజదొంగ వీడమ్మా
అయినా- "దొరికిపోరా! తరమలే"నను యశోదమ్మకు దొరికిపోయీ
చిట్టిరోలుకు చిన్నిపొట్టకు పొట్టితాటితో కట్టనిచ్చాడూ
దామోదరుని కన్నతల్లని ధరణి కీరితి కట్టబెట్టాడూ
అందువల్లా అందరం ఆ అమ్మలాగే చేతులెత్తీ
చేతగాదని చెప్పుకుందాము
నీవె దిక్కని ఒప్పుకుందాము
మనస్సారా మనస్సారా మనసునే నైవేద్యమిద్దాము
తెలిసి తెలియక చేసినట్టీ తప్పులన్నీ-మనతప్పులన్నీ
అగ్గిలోనా దూదిలాగా బుగ్గి అవుతాయి
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

మాయనై మన్ను వడమదురై మైన్దనై
తూయ పెరునీర్ యమునై తురైవనై
ఆయర్ కులత్తినిల్ తోన్రుమ్ మణివిళక్కై
తాయై క్కుడల్ విళక్కం శెయ్ద దామోదరనై
తూయోమాయ్ వన్దు నామ్ తూమలర్ తూవిత్తొళుదు
వాయినాల్ పాడి మనత్తినాల్ శిన్దిక్క
పోయ పిళైయుమ్ పుగుదరువా నిన్రనవుమ్
తీయినిల్ తూశాగుమ్ శెప్పు ఏల్ ఓర్ ఎంబావాయ్







మేలుకో అక్కరో మేలుకోచెల్లి
కన్నులారా కాదు మనసార తల్లి!
గణగణగణమని కోవెల గంటలు
భం భం భం మని శంఖనాదములు
కావుకావు మని భక్తుల మొరలూ
కావు కావుమని కాకుల కేకలు
ఇన్నిటిలో నీ చెవుల జంటతో
కొన్నిటినైనా వినలేదా?! - విన్నా మెలకువరాలేదా!
చాలు చాలిక నిద్దుర లేవే ముద్దులమొద్దూ!
పాలిండ్లకు విషము పూసిన - పూతన ప్రాణం పీల్చి చంపీ
బండి రాక్షసుని ఎడమకాలితో - ఎగరదన్నినా గండరగండడు
ఏమీ ఎరగని పాపాయల్లే - పాముసెజ్జపై తా పవళించీ
యోగనిద్రనే నటిస్తున్నాడు - నీ మల్లేనే
బద్ధకం చాలించి బుద్ధిగాలేవే
మేమంత సిద్ధమే - పరుగున్నరావే
తెల్లవారేలోపు తానాలు చేదాం
నోముల్లు నోచేసి స్వామి చేబడదాం
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

పుళ్ళుమ్ శిలంబినకాణ్ పుళ్ళరైయన్ కోయిలిల్
వెళ్ళై విళిశంగిన్ పేరరవమ్ కేట్టిలైయో?
పిళ్ళాయ్ ఎళున్దిరాయ్! పేయ్ ములై నఞ్జుండు
కళ్ళచ్చగడమ్ కలక్కళియ క్కాలోచ్చి
వెళ్ళ త్తరవిల్ తుయిల్ అమర్న్ద విత్తినై
ఉళ్ళత్తు క్కొండు మునివర్గళుమ్ యోగిగళుమ్
మెళ్ళ ఎళున్దు అరియెన్ర పేరరవమ్
ఉళ్ళమ్ పుగుందు కుళిర్న్దు ఏల్ ఓర్ ఎంబావాయ్









## 7

ఏ్రటింతా పక్షులన్నీ
రాత్రంతా రభసచేసీ
కేరింతలు కొట్టుతున్నా
తెల్లవారీ వారకుండా - పురు
గుల్లకోసం పాలోమంటూ వేటకెళ్ళాయే
ఏ్రటింతల కూతలయినా - వాటి రెక్కల మోతలయినా
వినపడలేదా - కొక్కొరొక్కో అక్కరో!

ఆలమందల రవాలూ పాల కుంభారవాలూ
ఆవుదూడలు ఆకలేసీ కేకలేసే అంబారవాలూ
అమ్మలూ అమ్మమ్మలూ నాన్నమ్మలూ
నిలువు కవ్వాలేసుకుంటూ నిండు కడవల పెరుగునూ
ఘుమ్ము ఘుమ్మని చిలుకుతుంటే

గాజుల్ల అందెల కిలకిలా
మంగళాసూత్రాల గలగలా
సవ్వడులు వినపడనెలేదా - కొక్కొరొక్కో అక్కరో
లేవెలేవే లేచిరావే నీవె నేర్పిన నోముకై
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

కీశు కీశెన్రు ఎంగుమ్ ఆనైచ్చాత్తమ్ కలన్దు
పేశిన పేచ్చరవమ్ కేట్టిలైయో? పేయ్ ప్పెణ్ణే!
కాశుమ్ పిరప్పుమ్ కలగలప్పక్కై పేర్తు
వాశ నరుంకుళల్ ఆయ్చ్చియర్ మత్తినాల్
ఓశై పడుత్త త్తయిర్ అరవమ్ కేట్టిలైయో?
నాయగప్పెణ్ పిళ్ళాయ్! నారాయణన్ మూర్తి
కేశవనై ప్పాడవుమ్ నీ కేట్టే కిడత్తియో?
తేశముడైయాయ్! తిర ఏల్ ఓర్ ఎంబావాయ్









మంచునురగలు నంచుకొంటూ
గరిక పరకల కరకరామని
కొరికి నమలీ - తీరుబడిగా నెమరువేయంగా
ఆలమందలు ఊరిబయటకు ఉరకలేయంగా
నల్లతూరుపు తెల్లబోయీ ఎఱ్ఱబారేవేళ లోపల
మూడుమారులు యమునలోనా మునిగిలేవంగా
కన్నెపిల్లలు చురుకు చురుకుగ పరుగుతీయంగా
వారినాపీ నీ వాకిట - నిలిపి ఉంచామే
ఎందుకో తెలుసా?
మదపుటేనుగులంటి మల్లులిద్దరిబట్టి మట్టికరిపించీ
కేశి రాక్షసు గొంతు చించీ వధియించీ
ఆయాసపడకుండా హాయిగా నవ్వేటి
మేటివీరుని మనము మెప్పించవలెనంటే
మార్గశిరనోములే మనకు మార్గమ్ము
లేచిరావే పిల్ల లేచిరా చెల్లి - కన్నె పిల్లలు పడు కష్టాలు చూసి
తనకోసమని తెలిసి తానె దయతలిచి
మననాదరిస్తాడు మన బాలకిష్టయ్య
కాత్యాయనీ తల్లి దీవించగాను - పెళ్ళాడుతాడమ్మ కల్యాణమూర్తి
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

కీళ్వానమ్ వెళ్ళెన్రు ఎరుమై శిరువీడు
మేయ్వాన్ పరన్దన కాణ్! మిక్కుళ్ళ పిళ్ళైగళుమ్
పోవాన్ పోగిన్రారై ప్పోగామల్ కాత్తు ఉన్నై
క్కూవువాన్ వన్దు నిన్రోమ్ కోదుకుల ముడైయ
పావాయ్! ఎళున్దిరాయ్ పాడిప్పరై కొండు
మావాయ్ పిళన్దానై మల్లరై మాట్టియ
దేవాదిదేవనై చ్చెన్రు నామ్ శేవిత్తాల్
ఆవావెన్రు ఆరాయ్న్దు అరుళ్ ఏల్ ఓర్ ఎంబావాయ్





మాణిక్యదీపాలు - మధుమధురధూపాలు
పందిరీ మంచాలు - చక్కన్ని పక్కల్లు
వెచ్చన్ని దుప్పట్లు - వేడుకల కలలు-
బాగు బాగే గాని బంగారు తల్లి
ఇంకెంతసేపే - నీ మొద్దు నిద్దరా
వాకిట్లో మా గోల చప్పట్లు తాళాలు
దుప్పట్లో దూరీ నిను లేపలేదా-
కాకితో నిదరోయి కోడితో లేవాలి
కొక్కొరొక్కో అక్కరో
అత్తమ్మ నీవన్న చెప్పమ్మ దానికి
చెప్పినా వినిపించుకోవటం లేదా-?
చెవులు దిబ్బళ్ళుపడి చెవుడు వచ్చిందా
చేతబడి మంత్రాల మాయ కమ్మిందా
మాయకమ్మిన గాని మనకేభయము లేదు
మాయావులను మించు మాయలాడున్నాడు
వాడె మనపాలి ధవుడు - ఆ రమాధవుడు!
వాని పేరెలుగెత్తి పిలిచిన క్షణమే
మాయలన్నీ ఇట్టె మాయమైపోతాయి
హాయిగా నోముల్లు నోచుకోవచ్చు
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

తూమణి మాడత్తు చ్చుత్తుమ్ విళక్కెరియ
తూపం, కమళ త్తుయిల్ అణై మేల్ కణ్ వళరుమ్
మామాన్ మగళే! మణిక్కదవమ్ తాళ్ తిరవాయ్
మామీర్! అవళై ఎళుప్పీరో! ఉన్‌మగళ్‌తాన్
ఊమైయో? అన్రిచ్చెవిడో? అనన్దలో?
ఏమప్పెరున్దుయిల్ మన్దిరప్పట్టాళో?
"మామాయన్ మాదవన్ వైకున్దన్" ఎన్రెన్రు
నామమ్ పలవుమ్ నవిన్రు ఏల్ ఓర్ ఎంబావాయ్






10

ఏమినోములు నోచినావో ఎంత పుణ్యము చేసినావో
ఇంత నిద్దుర దక్కె నీకమ్మ - అది ఎటులనే ఇంత నిద్దుర దక్కెనోయమ్మ?
తలుపు తెరవకపోతెమానీ
పలుకరించగ నోరు తెరువమ్మా - లేదా
పలుకె బంగారమ్మాయె నోయమ్మ!?
కన్నెత్తి చూడంగ పన్నెత్తి పలుకంగ
మొద్దు నిద్దుర అడ్డువచ్చేనా
ఎన్నడెరుగని ఇంత నిద్దుర ఎట్లు వచ్చీ నిన్నుపూనెను?
రామచంద్రుని శరము తగిలీ
కూలి నేలకు వాలుతున్నా
కుంభకర్ణుడి కానుకా యిది కొక్కొరొక్కో అక్కరో!
కలువ కన్నులు ముందు తెరచి - కన్నయ్యను కాస్త తలచి
పెదవులను ఆ పిదప తెరచి - తలుపులూ తరవాత తెరచి
ఉరికిరావే తెరువులోకీ యమున కరుగంగ
జలకమాడంగా - నోము నోచంగా
పిమ్మటను స్వామిని పెండ్లియాడంగా
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

నోత్తు చ్చువర్క్కమ్ పుగుగిన్ర అమ్మనాయ్!
మాత్తముమ్ తారారో వాశల్ తిరవాదార్?
నాత్తత్తుళాయ్ ముడి నారాయణన్ నమ్మాల్
పొత్తప్పరై తరుమ్ పుణ్ణియనాల్ పండు ఒరునాళ్
కూత్తత్తిన్ వాయ్ వీళ్న్ద కుంబకరణనుమ్
తోత్తుమునక్కే పెరున్దుయిల్ తాన్ తన్దానో?
ఆత్త అనన్దలుడైయాయ్! అరుంగలమే!
తేత్తమాయ్ వన్దు తిర ఏల్ ఓర్ ఎంబావాయ్








11

కొమ్ము విసిరే ఆలపొదుగుల పాలుపిదికే ఒడుపులో
బాణమేసినవాడి ప్రాణము పిండి, నెత్తురు పిదుకుచో
సాటిలేని హరివంశవీరుల శూరపుత్రివి నీవెలే
అందాల బరిణవు నీవెలే అపరంజి బొమ్మవు నీవెలే
నెమలిపింఛపు నీలకాంతుల నెరికురులసిరి నీవెలే
ఫణి ఫణాగ్రపు మణుల బోల్ ఘనజఘన లాస్యాల్ నీవెలే
ఎన్నిఉన్నా ఏమి లాభం నిద్ర ఒకటే నీదులోపం
జాము నుంచీ వేచిఉన్నా చెలులపైనా జాలితలచీ
లేచి రమ్మా మొద్దుగుమ్మా లేవెలేవె బద్ధకమ్మా
కృష్ణచంద్రుని అందరం పాడుతూ కొనియాడుతూ
ఊరేగుదాం తొలి వెలుగులో ఉహూకుహూయంటూ
యమునచేరీ మునకలేసీ నోమునోచీ తరించుదాం-
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

కత్తుక్కరవై క్కణంగళ్ పలకరన్దు
శెత్తార్ తిరల్ అళియ చ్చెన్రు శెరుచ్చెయ్యుమ్
కుత్త మొన్రిల్లాద కోవలర్ తమ్ పొర్కొడియే
పుత్తు అరవు అల్గుల్! పునమయిలే! పోదరాయ్
శుత్తత్తు త్తోళిమార్ ఎల్లారుమ్ వన్దు నిన్
ముత్తమ్ పుగున్దు ముగిల్ వణ్ణన్ పేర్ పాడ
శిత్తాదే పేశాదే శెల్వ ప్పెణ్డాట్టి! నీ
ఎత్తుక్కు ఉరంగుమ్ పొరుళ్ ఏల్ ఓర్ ఎంబావాయ్





12

దేవదేవుని ధ్యాసలోపడి
ఆవుదూడల సేవ మరిచిన అన్నగారికి చెల్లెలా
నీవు మాత్రము నిదురలోపడి
నోమునే మరిచావుగా
ఆకలేసీ దూడలన్నీ అంబారవాలూశాయగా
ఆలమందలు కుండపోతగ పాలవర్షము కురియగా
గోశాలలో పాలవరదలు మొగసాలలో బురదాయెగా
జారకుండా చూరు పట్టుక జాముసేపై ఉంటిమీ
జాలితలచీ వేళమించక వెలికిరావే చెల్లెలా
తనసతిని కోరిన పాపి రావణు పదితలలు తరుగంగా
కోలతీసీ ఎక్కుపెట్టిన కోసలేంద్రుని గాథలూ
పాడుకొంటూ యమునచేరీ పూజచేదామే - మన నోము నోదామే

**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

కనైత్తిళంగత్తెరుమై కన్రు క్కిరంగి
నినైత్తు ములై వళియే నిన్రుపాల్ శోర
ననైత్తు ఇల్లమ్ శేరాక్కుమ్ నర్చెల్వన్ తంగాయ్!
పనిత్తలై వీళ నిన్ వాశల్ కడైపత్తి
శినత్తినాల్ తెన్నిలంగై క్కోమానై చ్చెత్త
మనత్తుక్కు ఇనియానై ప్పాడవుమ్ నీవాయ్ తిరవాయ్!
ఇనిత్తాన్ ఎళున్దిరాయ్! ఈ తెన్న పేరురక్కమ్!
అనైత్తు ఇల్లత్తారుమ్ అరిన్దు ఏల్ ఓర్ ఎంబావాయ్







13

బకుడు వచ్చెను ముందుగా - వాడీ సఖుడు వచ్చెను పిమ్మటా
అఘుడు వచ్చెనటు పిదపనూ - బహుముఖులు రక్కసు లొచ్చిరీ
ఉప-'సంహరించెను' దుష్టులా - ఉత్తముల రక్షింపగా
దుష్టులూ నికృష్టులయినా మోక్షమ్మే పొందిరి అందరూ
చంపువేళను స్వామి తాకిన చిన్నిపున్నెము వల్లనూ
పాపులనె ప్రేముడితొ చూసీ పుణ్యలోకము లిచ్చుస్వామీ
పున్నెంబెతప్పొ అన్నెమెరుగని కన్నెపిల్లలకెన్ని ఇచ్చునో
చలిపులిని చంపేసి మంచమొదిలేసీ
చెంగుచెంగున రావె చెలియా - చలిలోన మునగంగ
సిరినోము నోచంగ శ్రీహరినిపొందంగ

**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

పుళ్ళిన్ వాయ్ కీండానైప్పొల్లా అరక్కనై
క్కిళ్ళి క్కళై న్దానై క్కీర్తిమై పాడిప్పోయ్,
పిళ్ళైగల్ ఎల్లారుమ్ పావైక్కళమ్ పుక్కార్,
వెళ్ళి ఎళున్దు వియాళమ్ ఉరంగిత్తు!
పుళ్ళుమ్ శిలుంబినకాణ్! పోదు అరిక్కణ్ణినాయ్!
కుళ్ళ క్కుళిర క్కుడైన్దు నీరాడాదే,
పళ్ళిక్కిడత్తియో? పావాయ్! నీ నన్నాళాల్
కళ్ళమ్ తవిర్న్దు కలన్దు ఏల్ ఓర్ ఎంబావాయ్








ముందుగానే నేను లేస్తా - లేచి మిమ్ముల లేపుతానని
బీరాలు పలికే ముసుగు తన్నిన భామ నువ్వేనా?
తెల్లారలేదని బుకాయించే పిల్ల నువ్వేనా?
కొలనులోనీ కలువపూలూ కనులు ముడుచుకు నిదురపోగా
రెక్కలిప్పిన ఎర్రతామర చక్కగా నవ్వింది లే
దేవదేవుని సేవకోసం పట్టుపంచెలు ధట్టికట్టీ
బీగాలు పట్టుకు పరుగులెత్తే పూజారి సాముల చూడవే
శంఖచక్ర శ్రీవత్సముల ముప్వంక భంగిమ నిలిచి వెలిగే
కృష్ణస్వామిని చూడవే - చూసి పాడి తరించవే
లేచిరావే లేచిరావే రేపల్లెపిల్లా లేచిరా

**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

ఉంగళ్ పుళక్కడై త్తోట్టత్తు వావియుళ్
శెంగళు నీర్ వాయ్ నెగిళ్న్దు ఆమ్పల్‌వాయ్ కూంబినగాణ్
శెంగల్ పొడి క్కూరై వెణ్‌పల్ తవత్తవర్,
తంగళ్ తిరుక్కోయిల్ శంగిడువాన్ పోదన్దార్,
ఎంగళై మున్నమ్ ఎళుప్పువాన్ వాయ్ పేశుమ్
నంగాయ్! ఎళున్దిరాయ్! నాణాదాయ్, నావుడైయాయ్!
శంగొడు శక్కరమ్ ఏన్దుమ్ తడక్కైయన్
పంగయ క్కణ్ణానై ప్పాడు ఏల్ ఓర్ ఎంబావాయ్





15

“రామ రామా! ఇది ఏమి నిదురే భామ!”
“అర్ధరాత్రివేళ అల్లర్లు పెట్టొద్దు
పోపొండి పోపొండి వేధించకండి”
“అర్ధరాతిరి కాదె అమ్మోరుతల్లి
తెలవారెనే కనులు తెరిచి చూడమ్మ”
“అందరూ వచ్చార? అది ముందు చెప్పు
ఆలోపుగా చిన్నకునుకు తీస్తాను”
“అందరూ వచ్చారు అది నిజము తల్లి
ఒక్కసారిటు వచ్చి లెక్కచూస్కోవే
కువలయా పీడాన్ని కొమ్ముతోకుమ్మి
మల్లులిద్దరి గొట్టి మట్టికరిపించి
కంస మామయ్యను హింసతోచంపి
అమ్మనాన్నల చెరను విడిపించె
అవ్వతాతలకును రాజ్యమేయిచ్చె
అట్టిదేవుని గూర్చి పాడుతూ వెళ్ళి
సిరినోము నోచంగ హరిని వరమడగంగ”
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

“ఎల్లే! ఇళంగిళియే ఇన్నమ్ ఉరంగుదియో?”
“శిల్లెన్రు అళైయేన్‌మిన్ నంగైమీర్! పోదరుగిన్రేన్”
“వల్లై, ఉన్ కట్టురైగళ్! పణ్డే ఉన్ వాయ్ అరిదు
“వల్లర్‌గళ్ నీంగళే నానే తాన్ ఆయిడుగ!”
“ఒల్లై నీ పోదాయ్ ఉనక్కు ఎన్న వేరు ఉడైయై
“ఎల్లారుమ్ పోన్‌దారో?” “పోన్‌దార్ పోన్‌దు ఎణ్ణి
వల్లానై కొన్రానై, మాత్తారై మాత్తు అళిక్క
వల్లానై, మాయనై ప్పాడు ఏల్ ఓర్ ఎంబావాయ్





16

గోవుల్లమందలకు గోపన్నరాజు
గోపన్నలందరికి నందయ్యరాజు
తానుండు లోగిలికి తలుపులేరాజు
తలుపు తాళాలకూ తలారి రాజు
తలపాగ తీర్చిన తలారిగారూ
మాణిక్యగడియల్లు సడలించివేగ
తలుపుల్లు తెరవండి దయచేసి తమరు
మాధవస్వాములూ మమ్ము రమ్మన్నారు
మేలుకొలుపులు పాడి లేపమన్నారు
మేము తలపెట్టినా నోముకొరకైన
మేళతాళాలన్ని మాకివ్వగలరు
లేదు కాదనబోక రేపు రమ్మనక
ఇపుడె తలుపులు తెరిచి ఇప్పించ దరిశెనము
ద్వారపాలకస్వామి దండాలు మీకు
అనుచు బ్రతిమాలాలి -
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

నాయగనాయ్ నిన్ర నన్దగోపనుడైయ
కోయిల్ కాప్పానే! కొడిత్తోన్రుమ్ తోరణ వాశల్ కాప్పానే!
మణిక్కదవమ్ తాళ్ తిరవాయ్
ఆయర్ శిరుమియరోముక్కు, అఱై పఱై
మాయన్ మణివణ్ణన్ నెన్నలే వాయ్ నేర్న్దాన
తూయోమాయ్ వన్దోమ్, తుయిల్ ఎళ ప్పాడువాన్;
వాయాల్ మున్న మున్నమ్ మాత్తాదే అమ్మా! నీ
నేశ నిలైక్కదవమ్ నీక్కు, ఏల్ ఓర్ ఎంబావాయ్





17

ఆకటి వేళలో ఆకలి తెలిసీ
దాహమేసేవేళ దప్పిపసిగట్టీ
బడలిపోయిన వేళ పడకనమర్చీ
అమ్మలా అయ్యలా అవ్వలా తాతలా
గోకులమ్మంతటిని సాకేటి రాజా! - ఓ నందరాజా!
ఇన్ని పసిగట్టావుగానీ
కొక్కొరొక్కో అనే కోడికూతా వినీ
మేలుకోవాలనీ కానుకోలేని నీ
బద్ధకంబేమనీ పొగడగలమయ్య
నందరాజా మేలుకో - బృందావనం బేలుకో
నల్లనయ్యను కన్నతల్లీ - రేపల్లెకు రంగవల్లీ - పల్లెకే మురిపాలవెల్లీ
లేవమ్మ యశోదమ్మ లేచిరావమ్మ
మూడు అడుగుల మేర అడిగీ
మంటినుండీ మింటివరకూ
మూడు లోకాల్ కొలిచి గెలిచిన
అవక్ర పరాక్రమా త్రివిక్రమా మేలుకో!
బంగారు కడియాలు కెంపుల్ల సొంపుల్లు
బాలార్క కిరణాల బాణాలు గుప్పించు
బలరామ చంద్రుడా మేలుకో
భువన భవనంబంత ఏలుకో
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

అంబరమే, తణ్ణీరే, శోరే అరం శెయ్యుమ్
ఎంబెరుమాన్ నన్దగోపాలా! ఎళున్దిరాయ్;
కొంబనార్క్కు ఎల్లామ్ కొళున్దే! కులవిళక్కే!
ఎంబెరుమాట్టి! యశోదాయ్! అరివురాయ్!
అంబరమ్ ఊడు అరుత్తు ఓంగి ఉలగళంద
ఉంబర్ కోమానే! ఉరంగాదు ఎళున్దిరాయ్;
శెంబొర్ కళ లడి చ్చెల్వా బలదేవా!
ఉంబియుమ్ నీయుమ్ ఉరంగేల్ ఓర్ ఎంబావాయ్





18

కదన రంగమునందు మడమ తిప్పనివాడు
మత్త గజమును మొత్తి చిత్తు చేయగలట్టి
నందగోపుల వారి అందాలకోడలా
నీలమ్మ నీలమ్మ నిదురింక చాలమ్మ
తలుపుల్లగడెతీసి తెరచిరావమ్మ
కుక్కుటమ్ములు పెక్కు చిలకల్లు గిలకల్లు
దిక్కులన్నీ పిక్కటిలునట్లు కూసేను
బాలకిష్టయ్యతో బంగారు బంతాడి
చివురంటి నీవేళ్ళు చెంగావులీనే
చాలమ్మ నీలమ్మ చాలు ఆటల్లు
కరకంకణమ్ములు అరచేతి చప్పట్లు
ఊరంత నోరంత మారుమోగేలాగ
నీలిచంద్రుని గూర్చి పాడుదాం
పాటపాడుతూ పాడుతూ ఆడుదాం
తలుపు బార్లా తెరిచి తరలి రావమ్మ
రావమ్మ రావమ్మ రావె నీలమ్మ
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

ఉన్దు మదగళిత్తన్ ఓడాద తోళ్ వలియన్
నన్దగోపాలన్ మరుమగళే! నప్పిన్నాయ్!
కన్దమ్ కమళుమ్ కుళలీ! కడై తిరవాయ్;
వన్దెంగుమ్ కోళి అళైత్తనగాణ్; మాదవి
ప్పన్దల్ మేల్ పల్కాల్ కుయిల్ ఇనంగళ్ కూవినగాణ్;
పన్దార్ విరలి! ఉన్ మైత్తునన్ పేర్ పాడ
శెన్దామరైక్కైయాల్ శీరార్ వళై యొళిప్ప
వన్దు తిరవాయ్; మగిళ్న్దు ఏల్ ఓర్ ఎంబావాయ్









పలుకే బంగారమాయెరా? ఓ దేవర!
పన్నెత్తీ పలుకా పలుకవు - కన్నెత్తీ చూడా చూడవు
నిన్నా మాకిచ్చిన మాట - మన్నింపా కోరవస్తిమి
కన్నెపిల్లలం పన్నిద్దరమూ నిన్నూ వరియింపా వస్తిమీ
నీకూ అంతటి నిదురేనా? నిజమా? అది నటనా! తెలుపర
మంచం పేద్ధమల్లెపందిరట!!? - కుంచెడంతేసి దంతపు కోళ్ళట!?
పూలగుత్తులట పాలదుత్తలట - నాలుగేసి దీపాల గుత్తులట
తెల్లటి చల్లటి దుప్పటిపైన - నల్లటి మోహన-మబ్బట!! అది నువ్వేనట!
ఆ నీల మోహనుడు నీలకౌగిట - నిదురిస్తున్నాడని విన్నాము
కన్నెపిల్లలం కనలేదు గాని - ఎన్నోవింతలు విన్నాము
అయినా అంతటి నిదురా దేవర! - మాట ఇచ్చి మరచినట్టి దేవర లేవర!
మానోమును నడిపీ ప్రోవరా - మమ్ము కావరా
అమ్మా బంగరు బొమ్మా నీలా - ఏలా ఈలాటి నిదురా
ఇది నిద్రా? నిద్రాదేవత ముద్రా? హే భద్రా!
నీ కౌగిళ్ళ సంకెళ్ళనుంచి - మా సామిని విడిపించీ
మా నోముకు అన్నీ ఇప్పించీ - కాత్యాయని కోపం తప్పించీ
పున్నెం కట్టుకో సర్వమంగళా! నీళా!
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

కుత్తు విళ క్కెరియ క్కోట్టుక్కాల్ కట్టిల్ మేల్
మెత్తెన్ర పంచశయనత్తిన్ మే లేరి
కొత్తు అలర్ పూంగుళల్ నప్పిన్నై కొంగైమేల్
వైత్తుక్కిడన్ద మలర్ మార్పా! వాయ్ తిరవాయ్;
మైత్తడమ్ కణ్ణినాయ్! నీ ఉన్ మణాళనై
ఎత్తనై పోదుమ్ తుయిల్ ఎళ ఒట్టాయ్కాణ్,
ఎత్తనై యేలుమ్ పిరవాత్త గిల్లాయాల్!
తత్తువమ్ అన్రు తగవు ఏల్-ఓర్ ఎంబావాయ్









ముప్పది మూడుకోట్ల సురలకు - ఎప్పుడు ఏ ముప్పొస్తుందోనని
ముప్పొద్దులూ కావలిగాచే - మురారిగారూ మా మొర వినరా
ముప్పులు ముంచుకు వచ్చేముందే - తప్పక అక్కడ వాలి వారినీ
కాపాడేసే గోపాలా - కాస్త భూలోకం - నరులను కూడా గమనించి కాపాడరాదా?
నిన్ను పొందగ నోముపట్టిన - కన్నెపిల్లలం మేము
చలిలో గజగజ వణుకుతు నిలిచిన - చిన్నపిల్లలం మేము
చప్పున వచ్చీ పూజకు వలసిన దప్పులివ్వు సామీ
అమ్మా నీలాసుందరి - మా అందరి వందనమందుకో
సన్నటి చక్కటి చినాదానా - కన్నుల్లో సిరులున్నాదానా
నవ్వుల రవ్వలు రువ్వేదానా - నోములన్ని పండించేదానా
కలువరేకులట కన్నులూ - కెంపుల సొంపులు చెంపలూ
శంఖంవంటీ కంఠము - నీ చక్కెర మోవే వైకుంఠము
పూర్ణకుంభములు - ఘనజఘనమ్ములు - రంభోరువులూ - ఎన్నో ఎన్నో
ఇన్నిటి నడుమా సన్నటి నడుమూ - అన్ని బరువులూ మోసీ అలసీ
చిన్నబోయెనా చిక్కిపోయెనా
చిక్కీ చిక్కీ మాయమాయెనా - ఉన్నట్టా అది లేనట్టా
ఉన్నా లేకున్నా ఒకటే-ట్టా!!
పడకను విడిచీ దిగ్గున లేచీ - పక్కనున్న పరమాత్మనులేపీ
నోమును నీమము తప్పక నడిపే - వరలక్ష్మి నీకు వందనం

**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

ముప్పత్తు మూవర్ అమరర్క్కు మున్ శెన్రు
కప్పమ్ తవిర్క్కుమ్ కలియే! తుయిలెళాయ్!
శెప్పముడైయాయ్! తిరలుడైయాయ్! శెత్తార్క్కు
వెప్పమ్ కొడుక్కుమ్ విమలా! తుయిలెళాయ్!
శెప్పన్న మెన్ములై! చెవ్వాయ్, చ్చిరుమరుంగుల్
నప్పిన్నై నంగాయ్! తిరువే! తుయిలెళాయ్!
ఉక్కముమ్ తట్టొళియుమ్ తన్దు ఉన్ మణాళనై
ఇప్పోదే ఎమ్మై నీరాట్టు ఏల్ ఓర్ ఎంబావాయ్









శ్రీనివాసమిది గోనిలయమ్మిది
గోగోపకులకు గొడుగై కాచిన గోవర్ధనమిది గోపాలా!
పిదుకకుండానె పొదుగులు పొంగీ కుండపోతగా పాలను కురిసీ
పరవళ్ళు తొక్కు పుణ్యభూమి ఇది గోపాలా
ఈ సీమనేలు నందగోపునికి ఇష్టపుత్రుడవు గోపాలా
దివినుండి భువికి దిగివచ్చినట్టి దేవదేవుడవు గోపాలా
ఆశ్రితవత్సల గోపాలా ఆపద్బాంధవ గోపాలా
నీతో పోరీ నీరై పోయీ నీ పాదాలే శరణని వచ్చిన
శత్రులందరిని చేరదీసినా
కరుణాకరుడా గోపాలా
నిదురలేవయ్యా లేచి రావయ్యా
వచ్చి మేళ తాళాలుయిచ్చి
మానోము నడిపించు గోపాలా
గోపాలుని దర్శించి కోరికలు కోరంగా
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

ఏత్త కలంగళ్ ఎదిర్ పొంగి మీదళిప్ప
మాత్తాదే పాల్ శొరియుమ్ వళ్ళల్ పెరుమ్ పశుక్కళ్
ఆత్త ప్పడైత్తాన్ మగనే! అరివురాయ్!
ఊత్తముడైయాయ్! పెరియాయ్! ఉలగినిల్,
తోత్తమాయ్ నిన్ర శుడరే! తుయి లెళాయ్;
మాత్తార్ ఉనక్కు వలితులైన్దు ఉన్ వాశర్కణ్
ఆత్తాదు వన్దు ఉన్ అడి పణియు మాపోలే
పొత్తియామ్ వన్దోమ్ పుగళ్న్దు ఏల్ ఓర్ ఎంబావాయ్








అండపిండ బ్రహ్మాండ నాయకులు అందరివలెనే
అల్పజీవులము పల్లెపిల్లలము అజ్ఞానులమగు మేమూ
అహంకార మమకార వికారపు కుబుసాలను విడచీ
నీపాదాల చెంత నిలచీ నీకడగంటి చూపుకై వేచీ
తనువెల్ల కనులుగా మనసెల్ల తపముగా
తపియించుచున్నాము దేవా
అరతెరచిన చిరుమువ్వల నోరులా
అరవిరిసిన కమలముల రెప్పలా
అరమూసిన నీకడగంటీ
చూపులు చాలవు స్వామీ
కనుతలుపులు రెండూ తెరచీ
బాలభానుడీ ఎర్రని వెన్నెల - బాలచంద్రుడీ తెల్లని వెన్నెల
పరమాత్మా నీ కరుణామృతమున
కలబోసీ గుమ్మరించవయా
మా పూజల పూవులు నీవై - మా పాటల మాటలు నీవై
అందుకునే స్వామివి నీవై - అందించే మేమూ నీవై
మా నోములు పండించీ - మమ్ము గాచు మాధవస్వామీ
మేలుకుని మమ్మేలుకో స్వామి

**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

అంగణ్ మాఞాలత్తు అరశర్ అబిమాన
బంగమాయ్ వన్దు నిన్ పళ్ళికట్టిల్ కీళే
శంగ మిరుప్పార్ పోల్, వన్దు తలై ప్పెయ్దోమ్
కింగిణివాయ్ చ్చెయ్ద తామరై పూప్పోలే
శెంగణ్ శిరిచ్చిరిదే ఎమ్మేల్ విళియావో?
తింగళుమ్ ఆదిత్తియనుమ్ ఎళున్దార్ పోల్,
అంగణ్ ఇరండుంగొండు ఎంగళ్ మేల్ నోక్కుదియేల్
ఎంగళ్ మేల్ శాబమ్ ఇళిన్దు ఏల్ ఓర్ ఎంబావాయ్








23

గుహలోన నిదురించు సింహరాజములేచి
ఫెళఫెళార్భటి ఒళ్ళు విరుచుకొనుచు
జూలు విదలించి గర్జించి వేటకొరకు
చూపుసారించి ఒడుపుగా నడచురీతి
సింహశార్దూల వృషభసామజ
చతుర్గతుల నీవు
సంభ్రమాశ్చర్య ఆనంద భయములన్ని
కలుగజేయుచు వచ్చి వాకిట కొలువుతీర్చి
మేము పట్టిన సిరినోము చివరివరకు
కర్త కర్మ క్రియలన్ని నీవెయగుచు
తల్లితండ్రియుదైవమ్ము నీవె యగుచు
మమ్ము దరిచేర్చు గోపాల చక్రవర్తి!
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

మారి మలై ముళంజిల్ మన్ని క్కిడన్దు ఉరంగుమ్
శీరియ శింగమ్ అరివుత్తు త్తీవిళిత్తు
వేరి మయిర్ పొంగ ఎప్పాడుమ్ పేర్న్దు ఉదరి
మూరి నిమిర్న్దు, ముళంగి ప్పురప్పట్టు
పోదరుమా పోలే, నీ పూవై ప్పూవణ్ణా! ఉన్
కోయిల్ నిన్రు ఇంగనే పోన్దరుళి, కోప్పుడైయ
శీరియ శింగాసనత్తు ఇరున్దు యామ్ వన్ద
కారియమ్ ఆరాయ్న్దు అరుళ్ ఏల్ ఓర్ ఎంబావాయ్





మూడు అడుగుల తోటి ముల్లోకముల కొలిచి
బలిని పాతాళమునకు పంపుపదము
పరసతిని చెరబట్టు లంక రావణుగొట్టి
కాల్చిబూడిద చేయు రామశరము
బండిరాక్షసు, వెలగపండు రాక్షసులను
చెండాడి చంపిన చిన్నిపదము
గోవర్ధనమ్మును గొడుగల్లె నిలబెట్టి
గోపకుల కాపాడు గొప్పచేయి
వేల లీలల నవలీల చేసినట్టి
చిన్ని కన్నా! శతకోటి మంగళములు
తనివార నినుగూర్చి ఆడిపాడంగ
దయచేయుమీ మాకు మేళతాళాలు
తనువార నినుపూజ చేసి తనియంగా
పూలు పాలూపళ్ళు దయ చేయవయ్యా!
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

అన్రు ఇవ్వులగమ్ అళన్దాయ్! అడి పోత్తి
శెన్రంగు త్తెన్నిలంగై శెత్తాయ్! తిరల్ పోత్తి
పొన్ర చ్చగడమ్ ఉదైత్తాయ్! పుగళ్ పోత్తి
కన్రు కుణిలా ఎరిన్దాయ్! కళల్ పోత్తి
కున్రు కుడైయా ఎడుత్తాయ్! గణమ్ పోత్తి
వెన్రు పగై కెడుక్కుమ్ నిన్ కైయిల్ వేల్ పోత్తి
ఎన్రెన్రున్ శేవగమే ఏత్తిప్పరై కొళ్వాన్
ఇన్రు యామ్ వన్దోమ్ ఇరంగు ఏల్ ఓర్ ఎంబావాయ్








25

ఎన్నిమాయలు చేసినావయ్యా
ఓ చిన్ని కృష్ణా
ఏమి లీలలు నడిపినావయ్యా
ఒక తల్లి కడుపున పుట్టినట్టేపుట్టి
వేరొక తల్లి వడిలోకి ఇట్టె జారావంట
చెరసాలలోపల నరజన్మమెత్తి
మొగసాల - రాకాసి ప్రాణాలు పీల్చి
భయముతో భయపెట్టి
తిండి తిననీకుండ - నిదురపోనీకుండ
కంసమామను చాల హింసపెట్టావంట-
రాక్షసుల కంతేసి శిక్షల్లు వేసినా
వెన్నకద నీ మనసు వేణుగోపాల-
కన్నెపిల్లలమంతా కాత్యాయనిని కొలుచు
నోము పట్టీ మేము నీకడకు వచ్చాము
సామగ్రి నీయరా సామిగోపాలా
మమ్మాదరించరా మువ్వగోపాలా
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

ఒరుత్తి మగనాయ్ పిరన్దు, ఓర్ ఇరవిల్
ఒరుత్తి మగనాయ్ ఒళిత్తు వళర
తరిక్కిలాన్ ఆగి తాన్ తీంగు నినైన్ద
కరుత్తై ప్పిళైప్పిత్తు, క్కంజన్ వయిత్తిల్
నెరుప్పెన్న నిన్ర నెడుమాలే! ఉన్నై
అరుత్తిత్తు వన్దోమ్; పరై తరుదియాగిల్
తిరుత్తక్క శెల్వముమ్ శేవగముమ్ యామ్ పాడి
వరుత్తముమ్ తీర్న్దు మగిళ్న్దు ఏల్ ఓర్ ఎంబావాయ్

తిరుప్పావై
దివ్యప్రబంధం
మేలుపలుకులు
మేలుకొలుపులు

26

వైకుంఠబాలుడా! వటపత్రశాయీ!
వందనాలందుకొని వరములీవయ్య
మేము తలపెట్టిన నోము నీకొరకె
తాళాలు మేళాలు దయచేయవయ్య
వెన్నముద్దల్లాంటి తెల్ల శంఖాలు
వెన్నెల వెలుగంటి వెల్లగొడుగుల్లు
జేగంట మోగాలి జగమంత ఊగాలి
ఊరంత భేరీలు హోరెత్తిపోవాలి
అయవార్లు ఏవోవో మంత్రాలు చదవాలి
పుంఖానుపుంఖాలు పూలు పళ్ళూ ఇచ్చి
భక్తులంతా మంగళారతులు పాడాలి
ఏమెరగనట్టు నువు క్రీగంట చూడాలి
గుడి చిరుగంటలు గుసగుసలు పోవాలి
వైకుంఠబాలుడా! వరములీయాలి

**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

మాలే! మణివణ్ణా! మార్గళి నీరాడువాన్
మేలైయార్ శెయ్వనగళ్ వేండువన కేట్టియేల్;
ఞాలత్తై యెల్లామ్ నడుంగ మురల్వన
పాలన్న వణ్ణత్తు ఉన్ పాంజశన్నియమే
పోల్వన శంగంగళ్, పోయ్ ప్పాడు ఉడైయనవే
శాలప్పెరుమ్ పఱైయే, పల్లాండు ఇశైప్పారే,
కోల విళక్కే, కొడియే వితానమే
ఆలిన్ ఇలైయాయ్! అరుళ్ ఏల్ ఓర్ ఎంబావాయ్








దారితప్పీ పోరవచ్చిన - రక్కసులనూ చంపకుండా
చేరదీసీ దారి చూపీ - వరములిచ్చేదేవరా! - మరి
ఆది నుంచీ నిన్నెకొలిచే - నీదు భక్తులము
మాకేమి వరములు దేవరా! మాకెట్టి వరములు దేవరా!
బంగారు గాజులు అందెలూ - కడియాలు గజ్జెలు కంకణాల్
కాసులాపేరులు కెంపులూ - రవ్వల్ల గజ్జెలూ మువ్వలూ
పట్టుపావడ రైకలూ - కొంతమందికి కోకలూ
ఇవ్వాలి సుమ్మా మువ్వగోపాలా!
ఆటపాటలతోటి అలసీ - ఆకలేసీ విందుకొస్తే
ముందుగా శ్రీపాయసాన్న - ప్రసాదమివ్వాలి
అందులోనూ పచ్చకర్పూరమ్ము వెయ్యాలి
యాలకూలూ జీడిపలుకులూ బోలెడెయ్యాలి
ఆవునేయీ వేయి గరిటలు పోసి కలపాలి
అది మూతి నుంచీ చేతి చివరకు పాకిపోవాలి
మోచేతి చివరకు చేరుకోవాలి
మాతోటి కలిసీ పాయసాన్ని జుర్రుతుండాలి
గోపాలకృష్ణా నువ్వు కూడా జుర్రుతుండాలి
ఇవియె మాకోరువరములు ఇందిరారమణా!
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

కూడారై వెల్లుమ్ శీర్ గోవిన్దా! ఉన్ దన్నై
ప్పాడిప్పరై కొండు యామ్ పెరు శమ్మానమ్
నాడు పుగళుమ్ పరిశినాల్ నన్రాగ,
శూడగమే తోళ్ వళైయే తోడే శెవిప్పూవే
పాడగమే ఎన్రనైయ పల్కలనుమ్ యామ్ అణివోమ్;
ఆడై ఉడుప్పోమ్; అదన్ పిన్నే పాల్సోరు
మూడ, నెయ్ పెయ్దు ముళంగై వళివార
కూడియిరున్దు కుళిర్న్దు ఏల్ ఓర్ ఎంబావాయ్








అమ్మ వెంట బిడ్డల్లా - ఆవువెంట దూడల్లా
అడవులంబడి తిరుగుతుండే గొల్లపిల్లలమూ
కల్లకపటాలెరుగనీ గోకులపు వారలమూ
పులీపుట్రా చంపకుండా - రాక్షసులు మింగేయకుండా
దేవుడల్లే నీవు వచ్చి గొడుగుపట్టావు
గోపాల చక్రవర్తీ! ఈ గోవులను వదిలిపెట్టీ వెళ్ళకయ్యా
ఈ స్నేహ బంధం జన్మజన్మల పున్నెమేనయ్యా
తెలిసి తెలియక తప్పు చేస్తే
కిష్టుడా కన్నయ్యా అంటే - ఒరే అంటే గిరే అంటే
నువ్వు నువ్వని చనువు చేస్తే
కోపగించక సర్దుకోవయ్యా
మా నోము కోసం మేళతాళా - లివ్వు మాసామీ!
**సిరినోము - హరిపూజ - గిరిపుత్రివరము**
**గోకులం కన్నెలకు కల్యాణకరము**
**లోకులం దరికిదే సౌభాగ్యప్రదము**
**పల్లెపిల్లా మేలుకో**
**రే-పల్లె పిల్లా మేలుకో**

కరవైగళ్ పిన్శెన్రు కానమ్ శేర్న్దు ఉణ్బోమ్!
అరివొన్రుమ్ ఇల్లాద ఆయ్క్కులత్తు ఉన్దన్నై
ప్పిరవి పిరన్దనై పుణ్ణియమ్ నామ్ ఉడైయోమ్,
కుఱైవొన్రుమ్ ఇల్లాద గోవిన్దా! ఉన్దన్నోడు
ఉఱవేల్ నమక్కు ఇంగు ఒళిక్క ఒళియాదు!!
అరియాద పిళ్ళైగళోమ్; అన్బినాల్ ఉన్దన్నై
చ్చిరుపేర్ అళైత్తనవుమ్, శీరి అరుళాదే,
ఇఱైవా! నీ తారాయ్ పఱై ఏల్ ఓర్ ఎంబావాయ్





అడిగినట్టీ బొమ్మలన్నీ అమ్మ కూడా ఇవ్వదూ
అమ్మలందరి కమ్మవైనా నువ్వు కూడా ఇవ్వకూ
అన్నెమేదో పున్నెమేదో మా కన్నెలెవరికి తెలియదూ
ఏది బాగో ఏది ఓగో నిన్న కూడా తెలియదూ
అందువల్లా నిన్నకోరిన వరాలన్నీ వద్దనీ - సిరిసంపదలు అక్కరలేదనీ
నోరుకోరిన నగా నట్రా మనసు కోరాలేదనీ - విన్నవిస్తూ వేరు వరములు కోరుతున్నామూ
అవధారు అంతర్యామీ అవధారు మమ్మేలు స్వామీ
ఇచ్చివేసిన వరము కన్నా ఇవ్వనిది బహురుచికరం కద
తీరబోయే కోరికా - ఆరబోయే హారతే కద
ఎన్నటికి ఆరని దీపమూ - నీ తోటి మాకూ సఖ్యమూ
అదే నిత్యం అదే సత్యం అదే శాశ్వతమనశ్వరం
మా పాలి స్నేహమా! గోపాలకుల దైవమా! - వేణునాదోంకారమా!
ఆలమందలపాలలో - పాలలోపల వెన్నలో
వెన్న గాచిన నేతిలో - నేతిని ప్రాశించు రుచులలో
అన్నిటా వ్యాపించి నీవు ఉన్నావనీ - నీవే ఉన్నావనీ
నమ్ముతున్నాము - అందరికి చెప్పుతున్నాము గోపాల!
నీవు కూడా మా నమ్మకాలను వమ్ము శాయకుమీ
ఈ ఒక్క వరమునే ఇమ్ముసుమ్మా - ఇంకేమి అడిగినా ఇవ్వద్దు సుమ్మా
ఏడేడు జన్మలకు మాకు కావలసింది
నీవెసుమ్మా నీ ప్రేమ సుమ్మా నీ పట్ల మా భక్తి సుమ్మా

శిత్తం శిరుకాలే వన్దు ఉన్నై చ్చేవిత్తు; ఉన్
పొత్తామరై అడియే పోత్తుమ్ పొరుళ్ కేళాయ్!
పెత్తమ్ మేయ్త్తు ఉణ్ణుమ్ కులత్తిల్ పిరన్దు నీ
కుత్తేవల్ ఎంగళై, క్కొళ్ళామల్ పోగాదు;
ఇత్తై ప్పరై కొళ్వాన్ అన్రుగాణ్ గోవిన్దా!
ఎత్తైక్కుమ్, ఏళేళు పిరవిక్కుమ్ ఉన్దన్నోడు
ఉత్తోమేయావోమ్; ఉనక్కేనామ్ ఆట్చెయ్వోమ్;
మత్తైనమ్ కామంగళ్ మాత్తు ఏల్ ఓర్ ఎంబావాయ్

కడలిలోనీ పడవలన్నీ అల్లనల్లన ఊగగా - శ్రీహరి
పాలకడలిని చిలుకసాగెను వేలు కవ్వముగా
ఇది తెలిసి సిరితల్లి దిగివచ్చె గోదగా
హరిని వరియించగోరిన గోపకన్నెల చేరబిలిచి
వారి చేతా ధనుర్మాసపు నోము పట్టించి
మూడు పదులా పాశురమ్ములు భక్తిపాడించి
తెలవారు జామున యమునలో చలిజలకమాడించీ
అష్టపత్నుల స్వామినొక వణకు వణికించీ
పూజలూ ఉద్యాపనల పిమ్మట - వారు తరియించా
ఆముక్త మాల్యదగాను తానూ - రంగనాథుని చేరెనూ
ఈ చమత్కారము చదివిపాడీ పాడించువారున్నూ
ధన్యులై ఆనందలోకాలందుకోగలరు
శ్రీరస్తు శుభమస్తు కల్యాణమస్తు

వంగక్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై
తింగళ్ తిరుముగత్తు చ్చేయిళైయార్ శెన్రు, ఇరైంజి,
అంగు అప్పరై కొండ ఆత్తై, అణిపుదువై
ప్పైంగమలత్తణ్ తెరియల్ పట్టర్పిరాన్ కోదై శొన్న
శంగత్తమిళ్ మాలై ముప్పదుమ్ తప్పామే
ఇంగు ఇప్పరిశు ఉరైప్పార్, ఈరిరండు మాల్ వరైత్తోళ్
శెంగణ్ తిరుముగత్తు చ్చెల్వ త్తిరుమాలాల్
ఎంగుమ్ తిరువరుళ్ పెత్తు ఇన్బురువర్ ఎంబావాయ్!






బాపు, రమణల అద్భుత సృష్టి ఈ కళాఖండం.

రమణగారి అక్షరాలు ఆకృతిదాల్చి బాపు బొమ్మలుగా మారతాయి.

ఇక్కడ బాపు బొమ్మలు అక్షరాకృతిదాల్చి రమణగారి గేయాలుగా మారాయి.

గోదమ్మతల్లి తన్మయంగా, అమాయకంగా పాడిన పాటలు తిరుప్పావై దివ్యభక్తికి సంకేతం.

తమిళంలో తిరుప్పావై దివ్యప్రబంధంగా వెలుగొందుతున్న గోదమ్మపాటలకు

బాపు గీసిన బొమ్మలు రమణగారిని కదిలించాయి.

అంతే!

ఆయన అచ్చతెలుగులో గోదమ్మ పాటల్ని పాడుకోవడం ప్రారంభించారు.

తానే గోదాదేవై తిరుప్పావైని తెలుగు గీతాలుగా కూర్చారు.

స్వచ్ఛత ప్రమాణంగా పొంగిన కవితావేశం 'మేలుపలుకుల మేలుకొలుపులు'గా రూపుదాల్చింది.

ఓ అజరామర కళాఖండమై మన ముందు నిలిచింది.

కళ్ళకద్దుకొని, గుండెలకు హత్తుకోండి.

బాపు, రమణలతో కలిసి మీరూ పాడుకోండి.

ఎమెస్కో